# సంగీత సత్యహరిశ్చంద్ర సుచరిత్ర

క్షో స ర ం గ ము.

జిల్లా వరంగల్ కస్బా హన్మకొండ

మ॥ రా॥ శ్రీ వార్యాల రాజేశ్వరరావు మక్తేదారుగారి

బాలత్రిపురసుందరీ దేవిసమాజ

ధర్మార్థ పుస్తకములు.

జిల్లా వరంగల్ కస్బా హన్మకొండ

సౌ॥ పింగలి అనంతమ్మ

సదోపవాసినిగారిచే

ర చి యిం పఁ బ డి న ది.

1918

మంజువాణీ ముద్రాక్షరశాల, ఏలూరు.

వెల 0-3-0

శ్రీగురవేనమః

# సత్యహరిశ్చంద్రలో కొసరంగము.



చంద్రమతిని కాలకౌశికునకు విశ్వామిత్రుని ధన నిమిత్తము విక్రయించినపిమ్మట కాలకౌశికుని గృహంబున జరుగబోవు సమాచారములు.

## కొసరంగము ప్రారంభము

వ॥ కాలకౌశికుడు లోహితునితో యిట్లనియె. లోహితాస్యా యిటురమ్మా నీవు అడవికి వెళ్లి దర్భలను విడాకులును కొనుకొనిరావలయును. నీతో చదువుచున్న బాలురు వెళ్లుచున్నారు వాళ్ళతో త్వరగావెళ్ళుము అనిన విని లోహితుండు యిట్లనియె. దేవా తమఆజ్ఞ తప్పక అలాగే బాలురతో వెళ్ళి ఆకులును దర్భలను తెచ్చెదను అంతలో బాలురువచ్చి లోహితుని బిలుచుటవ "బాలక త్వరగావెళ్ళుదమురండవగా" లోహితుండు విచారమొంది తన తల్లియగు చంద్ర

మతితో యిట్లనియె. ఓమాతా నేను ఏమిచేయవల యును గురువుగారునన్ను అడవికినేగి దర్భలను పత్ర ములను తెమ్మనమని పంపుచున్నారే నేను నడవజాల నమగులు తడబడుచున్నవి మనవిధి యిలాఘటించెను యిట్టి ఉపచారములుచేయుట కేగదా నన్నుకనుట.

కమాసురాగం—ఆదితాళం.

అమ్మమ్మానినుబాసి నడవి కేగజాల కన్న।తల్లిచా లకష్టమొందనేర అ॥

విప్రునింటనన్ను। వప్పగించనేల తప్పేమిజేసితిమా। అప్పాకావవేలా అ॥

మాయయ్యా నెడబాసి మరచియుంటిగదా మాత నిన్నుమరచి నిలువజాల తాళ అ॥

శత్రురుణబాధ అర్థమంతనోడ విశ్వామిత్రుబాధ నిత్తజేసెగదా అ॥

సతిసూతపతి గతినిటులనయ్యో హావతమునోచితి మా నేనెరుగనె తినహా అ॥

వ॥ అమ్మా మనజన్మమున నేమిదుష్కృతముజేసి తిమో యిట్టియిడుములు బడవలయునుగదా అనిన విని చంద్రమతి పుత్రునితో నిట్లనియె నాయనా విధి కృతంబిట్లుండిన తప్పించనేరతండ్రి నీవు జననమొం దినప్పుడు రాజాధిరాజులై రాజ్యంబేలెదవని సంతో షించిన ఈదినంబున నడవకి సంపవలయునుగదా నా యనా మనమందభాగ్యము ముందునడచినది యున్న దాపోయిరమ్మనుటకే నోరడాకున్నది త్వరగారమ్మా బాలులువచ్చుచున్నారే అని చంద్రమతి బాలురను జూచియిట్లనియె.

కమాసు రాగం — ఏకతాళము.

బాలులారారండివినుడి సమిధలకునుబోండి బా॥

క్షేమముగనురండిబాల సోదరుండవిడకఁ బా॥

దిక్కులేనిదానవయ్యా దీనురాలునేనికఁ ఒక్కబిడ్డ నంపుచున్న ఎటులసైదునేనికఁ బా॥

ఎన్నడై ననడువలేదు చిన్నబాలుడితడికఁ ఎన్ని శ్రమలుబడిన మీతమ్ముడనుచు జూడికఁ బా॥

కన్నబిడ్డనంపుచున్న కఠినురాలు నేనికః మాయన్న లారవీనిమరల దోడితెండినాకః బా॥

వ॥ బాలులారాయీబిడ్డను మీసోదరునిగాజూచుకొని వెంబడించుకొనిరండు అనినవిని అమ్మామీపుత్రునకునేమిభయములేదు మేము వెంబడించుకొని తెచ్చి వప్పగించెదము తల్లి లోహితుండుబాలుడని నడవికినేగినతదుపరి మేముకోసినపత్రములను దర్భలను నీబిడ్డకు నిచ్చిమరల తెచ్చివొప్పగించెదము అనిబాలురు వెంబడించుకొని నడవికినేగి లోహితుని నడవితోలిన పసిబిడ్డకు నపాయంబుగలుగునని తాముకోసిన దర్భ పత్రములు యితనికినిచ్చి దర్భలుచాలును విడాకులుచాలవు అనియును గురువులువారు దండింతురనియును మరివకవృక్షముచెంతచేరి విడాకులు కోయుచుండె నంత లోహితాస్యుడు సర్పదష్టుండై పరియాసనొందజాలక మాతా నేనుబ్రతుకజాల ఎట్టిదుస్థితిఘటించెను అమ్మాయని అరచి దలచుట.

ఫీలు రాగం—అటతాళము.

అమ్మానిన్నెడబాసి నడవి జేరితినినావిధి శ్రమననుభ
వించితిని అ॥

ఏమందునిక ముందు నేనెంచుబోదు పత్రోవదోచని
క వృతిబొంచుందు అ॥

ఎటుజూచినాగాని నటుశేషుడగుపడక గాధవు
తుని బాధనిటుజేసెనహా అ॥

నడుగులతడబడి నిడుములబడితిని నడువజాలను
తల్లి ననుజూచిపొమ్మి॥ అన్నలారానా విన్నపమొక్కటి
అమ్మనిటులతెండి దయాజాడలపొండి॥ అ॥

వ॥ అన్నలారా నేనుసర్పదష్టుండనై విషమెక్కినదే
నేనడవజాలనని భూమిపై బడి మూర్ఛనొందిన బాలు
ని లోహితునిజూచి యితరబాలురు ఇట్లనిరి. ఏప్రాణ
స్నేహిత! లోహితాస్య ఏమియీామ స్థితి ఘటించెను
నిన్ను విడచి గృహంబునకు పోవలయునుగదా చింతా
క్రాంతులై మూర్ఛనొంది లోహితుని నడవిలోనుంచి

కౌశికుని గృహంబునకుజని తల్లియగు చంద్రమతితో
యిట్లనియె. అమ్మా మీపుత్రుని దోమూని వెళ్లి
యు చిన్నబిడ్డయని దర్భలను విడాకులును మేముకోసిన
వాటిలోయిచ్చినను విడాకులు మాగురువుగారికి చాల
వులని మరియొకవృక్షముచెంతజేరి పత్రములుకోయు
చుండగా నందు సర్పదష్టుండై నడవిలో అమ్మా
అమ్మాఅని మూర్ఛనొందెను. తల్లీ మేము వెళ్లెదము
అని బాలురుచెప్పినవిని చంద్రమతి పుత్రకానేను ఎట్టి
వార్తవింటినని దుఃఖవేదనభరింపజాలక మూర్ఛనొంది
కొంతతడవుగాలేచి కాలహకంఠితో యిట్లనియె. అ
మ్మా నాపుత్రుడు సమిధలకు విడాకులకు నేగి సర్పద
ష్టుండై మృతినొందెనట బాలురుచెప్పుచున్నారు నే
నుబాలునిచూచుటకువెళ్లెదను సెలవొసంగుమనిన కల
లుకంఠియిట్లనియె. అహా ఏమివగలాడీ నీకేమఘారుడు
న్నాడా యింటిలోపనులన్నియు నెరవేర్చి నడవికినేగి
బాలునిచూచి త్వరగా రావలయును యింటిలో పను
లన్నియు చేసివెళ్లుము త్వరగారమ్మా యీఅల్లరివిని

కాలకౌశికుండు భార్యతో యిట్లనియె ఏమిచంద్రమతి చాలాఅరచుచున్నది విచారమేమికలిగినది అనినవిని కలహకంఠియిట్లనియె దానికేబారెడుపొడుగును మూరెడుకద్దు చారెడుకన్నులవాడు వున్నాడట తాము దర్భలకును విడాకులకును అడవికిపంపిన వటవృక్షము చెంత పత్రములుకోయుచుండగా సర్పదష్టుండై మృతినొందెనట వెంబడినేగిన బాలురు ఈపెకుచెప్పిరట యీమె ఆబాల్యుని చూడబోవుటకు నేశలవుయివ్వవలెనట దురాదృష్టురాలికి ఆయుర్దాయముమూడి మృతినొందినబాలుని యీమెచూచివచ్చునట యీమె పోయిచూచివచ్చిన మృతినొందినబిడ్డ లేచివచ్చునా ఏమిదీనిఆర్భాటము యింటిలోపనులన్నియు నెరవేర్చక యింటిగుమ్మములోపడి ఏడ్చుచుండగా నేనుఎట్లోభరించవలయును అనినవిని చంద్రమతితో కాలకౌశికుండు యిట్లనియె ఏదాసీయిటురమ్ము మాయింటిమనిషితొందరనొందినను నీవునిదానించుము ఆమెచెప్పినపనులన్నియునెరవేర్చి త్వరగా నడవికినేగి బాలునిచూచిరమ్ము

నెళ్లును. కాలకౌశికుండు ఆజ్ఞయిచ్చిన పుత్రదుఃఖము భరించజాలక శలవుగై కొని నడవికినేగి మృతినొంది యున్న బాలునికానరాక మరియొకవృక్షము చెంత నుండి విచారమునొందుచు ఆహాపుత్రకా ఎక్కడకచూ చిన నీవుకానరావే అడుగులు తడబడుచున్నవి అరణ్య మునకానరావే నాన్నా నిన్నుకనుపరచువారు ఏరీ దై వమా యీవిధియిట్లుఘటించెను అని దుఃఖవారధిలో మునుగుచు యిట్లనియె.

బెహార్ రాగం—ఆదితాళము.

అహాపుత్రకా అగుపడవేలరా నాపాపముచేత యీఆపదవచ్చెరా అ॥

సమిధలకునుజని సర్పముగరిచెనని బాలురుయదిగని చెప్పగనేవిని అ॥

ఎచటవున్నావురా నేనచటకినేగెదా నీవిచటకిరా నేనేచోటెరుగరా॥అ॥ చంద్రునిబోలు ఆనందుడ నెమోము సుందరచూపరానేనెందిక జొత్తురా॥ అ॥

ఆటలుపాటలు నాకగజూడక నేడే కాటికి బోవగా
కనులెటుజూతురా అ॥

ముదముతో రారా ముద్దిడిపోరా ననుమరచుటనే
లరా మనవిధియిటులాయెరా అ॥

వ॥ యీతీరునదుఃఖించి మరియొక వృక్షముచెంత
మృతిబొందియున్నలోహితునిపై పడివిచారమొందుట.

ఫీలువారాగం—అటతాళం.

అహోపుత్రకావిధి యిటులఘటించె ఎటులైతునిక
తాళరా॥ అ॥

దిక్కునీవేయని దినములుగడిపిన గ్రక్కున మృతి
బొంద గతివేరెలేరిక అ॥

నిమిషమునినుబాసి నిలువలేనైతిని యీవల్లకాటికి
వంప వచ్చితినిచట॥ అ॥

వ॥ యీవిధంబున దుఃఖించి మృతినొందిన బాలు
ని ఎత్తుకొని స్మశానంబునకు బోయి నిట్లనియె
కా ఎట్టిదుస్థితిఘటించెను మనభాగ్యములుండిన నొకనై

నా వెంబడిరారా అర్ధరాత్రివేళ అనుదానిని వచ్చుటా యెగాయని బిడ్డనుదహనముచేయుచుండగా కాటికా పరియగువీరభాహు పేరుగల సత్యహరిశ్చంద్రుడు బిడ్డను చూచి ఎవతివే అర్ధరాత్రివేళ బిడ్డను దహనముచేయు చున్నావు తాళుతాళుమని కర్రతో బిడ్డనుయీడ్చియిట్ల నియె అమ్మా నీవుఎవరవు అర్ధరాత్రివేళబిడ్డనెత్తుకొని వచ్చుట కారణంబేద్ది నాకురావలయు తుంము గుడ్డ యు మిత్తిబియ్యము మూడకాసును నొప్పగించి బిడ్డ నుచక్కగా దహనముచేయుము అనిన విని చంద్రమతి యిట్లనియె.

ఫీలువారాగం — ఏకతాళం.

అయ్యాసన్నికబోవు అడబిడ్డనుగా అర్ధమీకను లేదు వ్యర్థురాలనుగా అ॥

కానుచేతనులేదు కఠినమొండకనీవు కోపమొండక బిడ్డనికగాల్వనిమ్మా అ॥

దాపునెవ్వరులేరు దాసురాలను నీకు దోసిలొగ్గితిన [illegible] కాపాడుమినుము అ॥

వ॥ కాసుకైన తాళిలేదు నేను యొకరియింటిలో దాసిగానుండినదానను దీనురాలను నన్ను బ్రోచి బిడ్డను కాల్వనిమ్ము అ॥

అనిన విని వీరదాసుయిట్లనియె,

కాఫీరాగం—ఆటతాళం.

కాసుకులేదా కఠినమనీకా ఏజోటినిజూడనిక నీవె వతివెనహో కా॥

మంగళసూత్రమిటుదెమ్మ కాళీదునమ్మ గమ్మునబిడ్డను దహనముచేయుపోమ్మ కా॥

వ॥ ఓవనిత నీమంగళసూత్రమునిచ్చి బిడ్డను కాల్వ మనిన చంద్రమతి మూర్ఛనొంది ఆహా! నామంగళ సూత్రము నానాథునకుతప్ప యితరులకు అగుపడునా యితడేనానాథుండు అని విచారమొంది చంద్రమతి హరిశ్చంద్రుడు మృతినొందిన లోహితునిపైబడి విచారమొందుట.

ముఖారిరాగము—ఆదితాళము.

ఆహాలోహిత అగుపడవేలరా మేమెటు సైతుము

రా మృతినొందితివా అహా॥

నీవేగతియని నిరతమునమ్మిచు కాటికినే గేటికెను లతో జూతుమా అహా॥

లోహితచంద్ర నినుబోలు ఆనందుమునమ్మి బాసి నీవిందులరాకున్న మేమెందెకబోదుము అహా॥

వ॥ ఆహా లోహితా యీవిధంబున బిడ్డనుగురిం చి చింతనొంది ప్రాణసఖి నీవురావలయు తుంతు గుడ్డ యు బియ్యమును వదలి యజమానికివచ్చు కాసుమా డయును తెమ్ము మనవిధి యీలాఘటించెను ఎంతధ ర్మాత్ములమయితిమి మనమందభాగ్యము ముందునడ చెనుగదా అన విని చంద్రమతి కాలకౌశికుని గృహం బునకుబోవుచుండగా కాశీరాజుపుత్రునిచంపితివని అక్ర మముగ దండనచేసిన చంద్రమతి విచారమునొందుట.

సురటిరాగం—ఆటతాళం

చంద్రశేఖరాబ్రోవరా ఎందుజూత్తునిక తాళరా ముందునమబ్రోవవేరా వందనమిదె కావరావే॥ చ॥

వీరబాహునింటనున్న వీరదాసుడై నపతి జాలినొంద. బోక నన్నివాడజూడదో లెగదా॥ చ॥

పుత్రకశోమున నేనారాత్రిత్రోవనడచుచుండ శత్రు డైన విశ్వామిత్రుచిత్రమెల్లజూపుచుండ॥ చ॥

వ॥ అయ్యో నేనేమిఎరుంగనే విధియీలాఘటించె. నన భటులు కాశీరాజు అజ్ఞ అయినదని కాటికా పరియగు వీరబాహునిదగ్గరకువెళ్లి రాజపుత్రుని జంపి నది యీమెశిరముఖండించమనిన హరిశ్చంద్రుడు భా ర్యయనియెరింగి యిదికూడ సంప్రాప్తించెనాయనివిచా రమొంది శిరముపై ఖడ్గంబెత్తి కంఠము నరకబోవ పూలహారంబు అయిన రెండవమారు ఖడ్గంబునెత్తగా విశ్వామిత్రుడు ఎదురుపడివచ్చియిట్లనియె.

బెహార్ రాగము — ఏకతాళం.

చాలుచాలయ్యా చాలుపోవయ్యా యిదేటి క్రూ రమయ్యా నీవురాజువటవయ్యా॥ చాలు॥

రాజ్యమువిడనాడి నీసత్యమేయ్యా స్త్రీహత్యగద య్యా యింక బొంకవటయ్యా ॥చాలు॥

వ॥ విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునితో యిట్లని యె ఓహరిశ్చంద్ర నీవు యికనైన అసత్యమాడవా ఒక బొంకు బొంకుము నీరాజ్యమంత యధేచ్ఛగాదాయన నాసింద్రా బిడ్డమృతిజెందినను రాజ్యముమీకువప్పగిం చినను భార్యశిరముఖండించినను నేనుపడరానియిడుమ లుపడినను నేనుసత్యముతప్ప అసత్యమాడను నాక్షే మము మీకేల మీరుయూరకయుండుడు. సంధివచ నము విశ్వామిత్రుండు హరిశ్చంద్రునిసత్యమునకు మెచ్చి యిట్లనియె.

కమాచురాగం—అదితాళం.

యెంతనివర్ణింతు నేనిక సత్యహరిశ్చంద్రుని సుచ రిత్రము విచిత్రముకధ॥ యెం॥

రాజ్యమువిడనాడిన ఎదురాడక సత్యమునిలిపెన వ్యాడు॥ యెం॥

పుత్రుడు మృతిజెందిన విచారమొందక సతిశిరము ఖండించె నవుడు ఎంతనివర్ణింతునహా॥ యెం॥

యీమహానుభావుని ఎన్నతరమిక ఎచటజూచిన

యీసరిరాజులు లేరిక॥ యెం॥

వ॥ హరిశ్చంద్ర మహారాజా నీచరిత్రంబు వర్ణింపజాలము నీపరీక్షార్థము పంతమాతిడితినే కాని అన్నదానికి విచారములేదు. నీకుమారుడు లోహితుండు మృతినొందలేదు. నీభార్యా చంద్రమతి కాశీ రాజు పుత్రుని జంపి సొత్తులు దొంగిలించలేదు. యిది అంతయు నామాయాప్రేరితము:గనైన ప్రయాసము మృతినొందిన లోహితుని మంత్రాక్షింతలు జల్లిన నిద్రనొందినట్లు లేచి నిలువంబడియె విశ్వామిత్రుండు ఓ రాజా నీరాజ్యం చేను భరింపజాలను. నేసకొనంగెదను. నీవు అయోధ్యాపురంబు ప్రవేశించి పుత్రుండు, సత్యకీర్తి మంత్రియుక్తంబుగా రాజ్య పట్టాభిషేకము ___కొనుము. (రాజుమాట) మహానింద్రా నీకు ధారాకృతముగా నేనొసంగిన రాజ్యంబు నాకేల నీవే రాజ్యం చేలుమని నమస్కరించిన విశ్వామిత్రుండు యిట్లనియె రాజా రాజ్యము యెవ్వరికైన యివ్వదలంచుకొన్నాను. నీకు యిచ్చెదను గైకొనుము. అనిన విని

రాజా దేవా నీయిష్టము ఎవరికైన యిమ్ము అని వి శ్వామిత్రుండు నాకు యిష్టమగువాడవునీవే కావున అసత్యమాడి రాజ్యము అక్కరలేదని అందువా? మరల మాఆజ్ఞ శిరసావహించి రాజ్యము గైకొందు వా? దేవా నీయిష్టప్రకారమే అసత్యమాడను సత్యమే నిలిపెదనని విశ్వామిత్రుండు యిట్లనియె. రాజా మీరాజ్యము నీవు యేలుము భరింపజాలనని పుర జనులసమేతముగా రాజ్యము వప్పగించి పట్టాభిషేకం బు కావించిన హరిశ్చంద్రమహారాజును లోహితుం డును అయోధ్యాపురి పట్టణంబును సత్యకీర్తి మంత్రి యుక్తముగా పరిపాలించు చుండెను. విశ్వామిత్రుడు రాజుతో యిట్లనియె రాజా వశిష్టునితో ప్రతిజ్ఞ చేసి ని న్ను యింతపరీక్షించితినేగాని మరొకవిచారము కాదని ఆశీర్వదించిన రాజు విశ్వామిత్రుని గౌరవించి వంద నము ఆచరించుట. సత్యహరిశ్చంద్రుని చరిత్రంబు కొనసాగెను.

సమాప్తము.

యీగ్రంథములు విక్రయించిన సొమ్ము మాస్వంత ఖర్చుచేసికొనము. దేవతాసంబంధమయిన ధర్మ ఖర్చులకే వినియోగింపబడును.

మొదటి కూర్పునకు అయిన అచ్చుఖర్చు

మ॥ రా॥ శ్రీ॥ రాజేశ్వరరావుగారు, సౌ॥ అనంతమ్మ. గార్లచే భరించబడినది.

ఈగ్రంథములు వలయువారు:—

## సౌ॥ పింగలి అనంతమ్మగారు,

జిల్లా వరంగల్ హన్మకొండ అని వ్రాయవలెను.

